శ్రీరస్తు

# కృష్ణశతకము

భక్త హృద్రంజకరంబుగానుండునట్లు

...౦గు వెంకటరంగనాథరావుగారివలన,

ముద్రించి ప్రకటింపబడియె.



మొదటికూర్పు 1000 ప్రతులు

కాకినాడ.

శ్రీ వేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాల

1913

వెల 0—1—0

శ్రీగురుభ్యోనమః

# కృష్ణశతకము.

శ్రీరుక్మిణీశ కేశవ। నారదసంగీతలోల నగధరశౌరీ। ద్వారకనిలయజనార్దన। కారుణ్యముతోడ నన్ను గావుముకృష్ణా॥ ౧ నీవేతల్లివి తండ్రివి। నీవే నాతోడునీడ నీవే సఖుడౌ। నీవేగురుడవు దైవము। నీవే నాపతియుగతియు నిజముగకృ॥ ౨. నారాయణ పరమేశ్వర। ధారాధరనీలదేహ దానవవైరీ క్షీరాబ్ధిశయన యదుకుల। వీరా నను గావుకరుణ వెలయగకృ॥ ౩. హరియను రెండక్షరములు। హరియించును పాతకముల నంబుజనాభా। హరినీ నామమహాత్మ్యము హరియని పొగడంగవశమె హరిశ్రీకృ॥ ౪. కూర్మిరాత్ముడజామీళుడు। నారాయణ యనుచు నాత్మ నందనుబిలువ। న్నేరీతి నేలుకొంటివి। యేరీనీసాటివేల్పు లెందునకృ॥ ౫. చిలుకనొకరమణిముద్దుల। చిలుకను శ్రీరామయనుచు శ్రీ

పతివేరం। బిలిచిన మోక్షమునిస్తివి। అలరగమి
ము దలచుజనుల కరుదాకృ॥ ౬. అక్రూర వరద
మాధవ। చక్రాయుధఖడ్గపాణి శార్ఙ్గముకుందా।
శక్రాదిదివిజసన్నుత। శుక్రార్చిత నన్ను గరుణ
జూడుముకృ॥ ౭. నందునిముద్దులపట్టిని। మందరగి
రి ధరుని హరిని మాధవువిష్ణున్। సుందర రూపుని
మునిగణ। వందితుమిముదలతు భక్తవత్సలకృ। ౮.
ఓకారుణ్యపయోనిధి। నాకాధారంబవగుచు నయ
ముగ బ్రోవ। న్నాకేల యితరచింతలు। నాకాధి
పవినుతలోక నాయకకృ॥ ౯. వేదంబులుగన నేర
నియాదిమహాబ్రహ్మమూర్తియనఘుమురారీ। నాది
కుఁజూచిగావుమునీది కేఁనమ్మి నాడనిజముగకృ॥
పదునాలుగు భువనంబులు। కుదురుగనీకుక్షినిల్పు
కొననేర్పరివై విదితంబుగ యాదేవికి। యుదరపు
లో నెట్లునాదిగి యుంటివికృ॥ ౧౧. అష్టమిరోహి
ప్రొద్దున। యష్టమగర్భమునబుట్టి యాదేవకికిం।
దుష్టుని కంసువధింపవె। సృష్టిస్థితి లయము లెసగ
జేయగకృ॥ ౧౨. అల్లజగన్నాధును వే్ర। పల్లెయ
క్రీడార్థమయ్యె పరమాత్మునకున్। గొల్లసతియా

యశోదయు । తల్లియునైచన్ను గుడిపెదనరగకృ॥
అందెలు గజ్జెలు మ్రోయగ । చిందులుద్రొక్కుచు
ను వేడ్కచెలువారంగా । నందునిసతియాగోపిక ।
ముందఱనాడుదువు మిగుల మురియుచుకృ॥ ౧౪.
హరిచందనంబుమేనును । కరమొప్పెడు హస్తము
లను కంకణరవముల్ । యురమునరత్నము మెఱ
యగ । బరగితివౌచిన్నిబాల ప్రాయముకృ॥ ౧౫. పా
ణితలంబున వెన్నయు । వేణీమూలంబునందు వెల
వెలయగపింఛం । బాణీముత్యముముక్కున । బా
లుడవైదాల్చు శేషశాయివికృ॥ ౧౬. మడుగుకుజనికా
ళింగుని । పడిగలపైభరతశాస్త్రపద్ధతి వెలయం ।
గడువేడుకతోనాడెడు । యడుగులు నేమదిని ద
లతునచ్యుతకృ॥ బృందావనమునబ్రీతిన్ । నందార్భ
కమూర్తివేణునాదముసేయన్ । మందార మూలము
నగో । విందా పూరింతు వౌర వేడుకకృ॥ ౧౭.
వారిజనేత్రలు యమునా వారినిజలకంబులాడవ
చ్చినసేయన్ । చీరలు ముచ్చిలియిచ్చితివి । నేరుపరా
యిదియునీకునీతియెకృ॥ ౧౮. దేవేంద్రుడలుకతో
డను । వావిరిగా రాళ్లవానపడిగురియింపం । గోవర్ధ

నగిరియెత్తితి। గోవులగోపకులగాచుకొరకై కృ। ౨౦।
అండజవాహననిను। బ్రహ్మాండంబులు బంతులట్ల
యాడెదునీవుం। కొండలనెత్తితివందురు। కొండిక
పనిగాక దొడ్డకొండా కృ॥ ౨౧ అంసాలంబితకుండ
ల। కంసాంతకనీవు ద్వారకాపురిలోనన్। సంసారి
రీతినుంటివి। యసురాంతక కేంద్రవైరియచ్యుతకృ॥
౨౨॥ పదియారువేలనార్వురు। సుదతులు మైన
మంద్రుసీకుసొంపుగభార్య। ల్విదితంబుగ బహు
రూపుల। వదలకభోగింతువౌర వేడుక కృ॥ ౨౩॥
అంగనపసువునధోవతి। కొంగున నటుకులనుము
డుచుకొనివచ్చినయా। సంగతివినిదయనొసగితిరం
గుగసంపదలులోకరక్షక కృ॥ ౨౪ ॥ ఓవసుదేవకు
మారక। కావుమునామానమనుచు కామినివేడ।
న్నావనజాక్షికిని స్తివి। శ్రీవరయక్షయమటంచుచీ
రలుకృ॥ ౨౫॥ శుభ్రమగు పాంచజన్యము। అభ్రం
కషపగిది మ్రోవనాహవభూమిన్। విభ్రమలగుద
నుజసుతా। గర్భంబులుబగులజేయుఘనుడా కృ॥
౨౬॥ జయమును విజయున కివ్వవె। హయములు
ములుకోల మోపియదలించిమహా। రయమునవొ

ప్ప పెతేరును । భయమునరిపుసేనవిరిగిపారగకృ॥
దుర్జనులగు నృపసంఘము । నిర్జింపగదలచినీవు నిఖి
లాధారాదుర్జనులను వధియింపను । నర్జునునకు నీ
వు సా[illegible]థైతివికృ॥ ౨౮. శక్రసుతుగాచుకొరకై । చ
క్రముచేపట్టిభీష్ము చంపగజనునీ । విక్రమమేమని
పొగడుదు । నక్రగ్రహసర్వలోకనాయకకృ॥౨౯.
దివిజేంద్రసుతుని జంపియు । రవిసుతురక్షించినా
వు రఘురాముడవై దివిజేంద్రసుతునిగాచియు। ర
విసుతుబరిమార్చితౌరరణమునకృ॥ ౩౦. దుర్భరబా
ణముగారాగా । గర్భములోనుండియభయకావుమట
న్న । నిర్భరకృపరక్షిస్తివి । అర్భకు నభిమన్యుసు
తునినచ్యుతకృ॥ ౩౧. గిరులందు మేరువౌదువు । సు
రులందున నింద్రుడౌదు చుక్కలలోన । న్బరమా
త్మచంద్రుడౌదువు । నరులందును నృపతివౌదున
యముగకృ॥ ౩౨. చుక్కల నెన్నగవచ్చును । గ్ర
క్కున భూరేణువులను గణుతింపంగన్ । జొక్క
పునీగుణజాలము । నక్కజమగు లెక్కపెట్టనజు
నకుకృ॥ ౩౩. కుక్షినినిఖిలజగంబులు । నిక్షేపము జే
సి ప్రళయనీరధినడుమ । నక్షయవటపత్రముపై ।

దక్షత పాలించునట్టి ధన్యుఁడ కృ॥ ౩౫. విశ్వోత్పత్తికి
బ్రహ్మవు। విశ్వమురక్షింపఁదలఁచి విష్ణుఁడవనఁగా। వి
శ్వము జెరుపను హరుఁడవు విశ్వాత్మకనీవె యగుచు
వెలయఁగ కృ॥ ౩౬. అగణితవైభవ కేశవ। నగధరవ
నమాలియాది నారాయణయో। భగవంతుఁడ శ్రీ
మంతుఁడ। జగదీశ్వర శరణు శరణు శరణము కృ॥
మగమీనమవై జలధిలో। పగతుని సోమకుని జంపి ప
ద్మభవునకు। న్నిగమములు దెచ్చియిస్తివి। సుగు
ణాకర మేలు భక్తసులభుఁడ కృ॥ ౩౭. అందఱుసురలు
ను దనుజులు। పొందుగ క్షీరాబ్ధిదఱువ పొలుపున నీ
వున్। ఆందముగ కూర్మరూపున। మందరగిరియెత్తి
తౌర మాధవ కృ॥ ౩౮. ఆదివరాహమవయ్యును।
నాదను జహిరణ్యనేత్రుహతు జేసితగన్। మోద
మున సురలు పొగడగ। మేదినివడిగొడుగుయెత్తిమె
రసితి కృ॥ ౩౯. కెరలియరచాతకంబము। నరుదుగ వే
యంగ వెడలియసురేశ్వరునిన్। యురమును జీరివ
ధిస్తివి। నరహరిరూపావతారనగధర కృ॥ ౪౦. వసు
గువయి మూడునడుగులు। అడిగితివౌ భళిరభళిర
యఖిలజగంబుల్। దొడిగితివి నీదు మేనున। గడుచి

త్రిమునీచరిత్రఘనుడవుకృ॥ ౪౧. ఇరువదొకమాటు
నృపతుల। శిరములుఖండించితౌర చేగొడ్డంటన్। ధ
రకశ్యపునకునిచ్చియు। పరగగజమదగ్ని రామభ
ద్రిష్కృ॥ ౪౨. దశకంఠునిబరిమార్చియు। కుశల
ముతోసీతదెచ్చికొనియునయోధ్య। న్విశదముగకీ
ర్తినేలిన। దశరథరామావతారధన్యుడకృ॥ ౪౩. ఘ
నులగుధేనుకముష్టిక। దనుజులచెండాడితౌర తగ
భుజశక్తిన్। అసహాత్మ రేవతీపతి। యనగాబలరామ
మూర్తియలరితికృ॥ ౪౪. త్రిపురదైత్యులభార్యల। ని
పుణతతో వ్రతముచేతనిలిపినకీర్తుల్। కపటపురాజవు
భళిరే। కృపగలబుద్ధావతారకీర్తితకృ॥ ౪౫. బలువుగ
లతేజినెక్కియు। యిలపైధర్మంబునిలుపహీనులద్రు
న్పం। గలియుగముతుదినివేడుక। కలికివిగానున్న
లోకకర్తవుకృ॥ ౪౬. వనజాక్షభక్తవత్సల। ఘనులగు
త్రైమూర్తులందుకరుణానిధివై। విను నీసద్గుణజాల
ము। సనకాదిమునీంద్రులెన్న జాలరుకృ॥ ౪౭. అప
రాధసహస్రంబులు। అపరిమితములైనయఘమున
నిశము నేనుం। గపటాత్ముడనైచేసితి। చపలులునిను
గావు శేషశాయివికృ॥ ౪౮. నరపశువుమూఢచిత్తుడ।

దురితారంభుడనుమిగులదోషకుడను నే। గురుతెరు
గనెంతవాడను। హరినీవే ప్రాపుదాపు నాదువు కృ॥
౪౯. పరనారీముఖపద్మము। గురుతుగకుచకుంభము
లనుగొప్పునురమ్ము। న్నరయంగని మోహింతురు।
నిరతమునినుభక్తిగొల్వనేరరు కృ॥ ౫౦. పంచేంద్రి
యమార్గంబులు। కొంచపుబుద్ధినిచరిస్తికొన్ని దినం
బుల్ । యించుకసజ్జనసంగతి। యంచునుమిమ్మెరిగి
నానుయిప్పుడుకృ॥ ౫౧. కష్టదురాచారినికడు నే।దు
ష్టచరిత్రుడనుజాలదుర్బుద్ధిని నే। నిష్ఠనినుగొల్వనేర
ను। కష్టుని ననుగావు కావుకరుణను కృ॥ ౫౨. కుంభీం
ద్రవరద కేశవ। జంభాసురవైరిదివిజసన్నుతచరితా।
యంభోజనేత్రజలనిధి గంభీరుడనన్ను గావుకరుణ
నుకృ॥ ౫౩ ॥ దిక్కెవ్వరుప్రహ్లాదుకు। దిక్కెవ్వరు
పాండుసుతుల దీనులకెపుడున్ । దిక్కెవ్వరయ్యె
హల్యకు। దిక్కెవ్వరునీవునాకు దిక్కవుకృ॥ ౫౪.
హరినీవేదిక్కునాకును। సిరితోనేతెంచి మకరిశి
క్షించినయట్లు। బరమేష్ఠిసురులు బొగడగ। కరిగా
చినరీతినన్ను గావుము కృ॥ ౫౫. పురుషోత్తమలక్ష్మీ
పతి। సరసిజగర్భాదిమౌనిసన్నుతచరితా। మురభం

జనసుర రంజన । వరదుడవగునాకు భక్తవత్సల కృ॥ ౫౬. కరితురగములుతీర్థాగముములు।వ్రతములుదానములు సేయవలెనాలక్ష్మీ । పతిమిముదలచినవారికి । నతులితపుణ్యములు గలుగుటరుదాకృ॥ ౫౭. స్తంభమున వెడలిదానవ । డింభకురక్షించినట్టి రీతిని వెలయ । న్నంభోజనేత్రజలనిధిగంభీరుడ నన్ను గావుకరుణనుకృ॥ ౫౮. శతకోటిభానుతేజుడ । యతులితసద్గుణ గణాఢ్యయంబుజనాభా । రతినాథజనకలక్ష్మీ । పతిహితననుగావుభక్తవత్సలకృ॥ ఆంధుడ షేనురితాత్ముడ । నిందలకోడిగట్టి నట్టినీచునినన్ను । న్సందేహింపక కావుము । నందునివరపుత్ర నిన్ను నమ్మితికృ॥ ౬౦. గజరాజ వరద కేశవ । త్రిజగత్కల్యాణమూర్తిదేవమురారీ । భుజగేంద్రశయన కేశవ । విజయార్చితనన్ను గావవేడితికృ॥ ౬౧ గోపాల దొంగమురహర । పాపాలనుబారదోలుప్రభుడవునీవే । గోపాలమూర్తిదయతో । నాపాలిటగలిగిప్రోవునమ్మితికృ॥ ౬౨. దుర్మతినేబలుకష్టపు కర్మంబుల జేసినట్టికష్టుడనన్నున్ । నిర్మలునిజేయవలెని। ష్కర్ముడనినునమ్మినాడ సత్యముకృ॥ ౬౩. దుర్వార

చక్రినరవర । శర్వాదిప్రణుతవినుతజగదాధారా
నిర్వాణనాథమాధవ । సర్వాత్మకనన్ను గావుసర
సుఁడకృ॥ ౬౪। సుత్రామనుతజనార్దన । సత్రాజిత్తన
యనాథ । సౌందర్యకళా । చిత్రావతారదేవకి । పు
త్రానను గావుసీకుపుణ్యముకృ॥ ౬౫. బలమెవ్వఁడుక
రిబోత్రవను బలమెవ్వఁడు పాండుసుతులభాగ్యనుగా
వం । బలమెవ్వఁడు సుగ్రీవుకు । బలమెవ్వఁడునీవునా
కు బలమౌకృ॥ ౬౬. పరుసముసోకిన యినుమును।వ
రుసతో బంగారమైన వడువునజిహ్వాన్। హరినీనామ
ముసోకిన। సురవందిత నేను నటులనుభుఁడకృ॥ ౬౭.
ఒకసారి నీదునామము । ప్రకటముగాదలచువారి
పాపములెల్లం వికలములైదొలగుటకును । సకలార్థ
యజామిళుండుసాక్షియెకృ ॥౬౮॥ హరిసర్వంబు
నగలఁడన గరిమతోదైత్యుండుబలుక కంభములో
నన్ । యిరవొందవెడలిచీరవె। శరణన్న విభీషణుం
డుసాక్షియెకృ॥ ౬౯ ॥ భద్రార్చితచరణాబ్జసుభ
ద్రాగ్రజసర్వలోకపాలనహరిశ్రీ। బలభద్రానుజకే
శవ । భద్రాధిపనన్ను బ్రోవుభయహరకృ॥ ౭౦ ॥
యేటువలెకరిమొరవింటివి యేటువలెప్రహ్లాదుకభ

యమిస్త్రీకి కరుణ । న్నటువలెననురక్షింపుము । కట
కటనినునమ్మి నాడ కావుముకృష్ణ॥ ౭౧ ॥ తటతటలేటికి
జేసెదు । కటకటపరమాత్మనీవుఘంటాకర్ణున్ । యె
టువలెనిపుణునిజేసితి । నటువలెరక్షింపుమయ్యాయ
చ్యుతకృష్ణ॥ ౭౨ ॥ తురగాధ్వరంబుజేసిన ॥ పురుషుల
కునులేరెపదవిపుట్టుటయేమో । హరిమిముదలచి
నవారికి । యరుదాకైవల్యపదవియచ్యుతకృష్ణ॥ ౭౩ ॥
ఓభవబంధవిమోచన । యోభరతాగ్రజము
రారి యోరఘురామా । యోభక్తకామధేనువ ।
యోభయహరనన్ను గావుమురహరికృష్ణ॥ ౭౪. ఓ
తండ్రి కనకకశ్యపు । ఘాతకునైయతని సుతుని క
రుణనుగాచం । బ్రీతిసురకోటి బొగడగ । నాతం
డ్రీనిన్ను నేను నమ్మితికృష్ణ॥ ౭౫. ఓపుండరీకలోచన ।
యోపురుషోత్తమముకుంద యోగోపించా । యోపు
రసంహారమిత్రుడ । యోపుణ్యుడనన్ను బ్రోవు
మోహరి కృష్ణ॥ ౭౬. ఏవిభుఘోరరణంబున । రా
వణువధియించిలంకరాజుగ నిలిపెన్ । దీపించియా
విభీషణు । నావిభునేదలతునేను నచ్యుతకృష్ణ॥ ౭౭.
గ్రహభయ దోషముబొందదు । బహుపీడలుచే

రవెరచు పాయును నఘము। ల్లిహాపరఫలదాయక
విను। తహ తహ లెక్కడివినిన్ను దలచిన కృ॥
౨౫. గంగ మొదలైన నదులను। మంగళముగ జే
యునట్టిమజ్జనములకుంసంగతిగలిగినఫలములురం
గుగమిముదలచుసాటిరావురకృ॥ ౨౬. ఆదండకా
వనంబున। కోదండముబాల్చినట్టికోమలమూర్తి। నా
దండకావురమ్మి। వేదండముకాచినట్టివేల్పవుడకృ॥
౨౭. చూపుమునీరూపంబును। పాపపుదుష్కృతము
లెల్లపంకజనాభా। బాపుమునాకునుదయతో। శ్రీప
తినినునమ్మినాడసిద్ధముకృ॥ ౨౮. నీనామముభవహా
రణము। నీనామముసర్వసౌఖ్యనివహాకరంబు। నీ
నామమమృతపూర్ణము। నీనామము నేదలంతుని
త్యుడకృ॥ ౨౯. పరులనునడిగినజనులకు। కురుచ
నుమీయనియటంచుగురుతుగనీవు। గురుచవునైనే
వేడితి। ధరపాదత్రయముబలిని తద్దయుకృ॥ ౩౦.
పాలును వెన్నయుముచ్చిలి। రోలనుమీతల్లిగట్టరో
షముతోడన్। లీలావినోదివైతివి। బాలుడవాబ్రహ్మ
గన్న ప్రభుడవుకృ॥ ౩౧. ఏఘటికనునీనామము। ల
ఘుమతితోదలపగలనెలక్ష్మీరమణా। అఘములుబా

వుముదయతో। రఘురాముడవైనలోకరక్షకకృ॥
౭౫. అప్పాయిత్తువుదయతో। నప్పాలను నతిరసం
బులనుభవశాలీ। అప్పానసుగనుగొనవే। యప్పాన
నుబోవ్రువేంకటప్పాకృ॥౭౬. కొంచెపువాడనుమ
దిలో। నుంచకుమీవాసుదేవగోవిందహరీ। యంచి
తముగనీకరుణకు।కొంచెమునధికంబుగలదెకొంత
యుకృ॥౭౭. వావిరినీభక్తులకుం। గావరమున.నెగ్గు
సేయుగర్వాంధులకున్। దేవవధించుటవింటిని। నీ
వల్లనుభాగ్యమయ్యెనిజముగకృ॥ ౭౮. అయ్యాపం
చేంద్రియములు। వుయ్యాలలుచూచినట్లువూరకనే
ను। న్నీయాజ్ఞదలచనేరను। కుయ్యాలింపుముమహో
త్తగురుతుగకృ॥ ౭౯. కంటికిరెప్పవిధంబున। బంటు
గదాయనుచునన్ను బాయకయెపుడు। న్నీవుండ
వెరవనేలా। కంటకమగుపాపములనుగడచితికృ॥
యమునికియికనేవెరవను। కమలాక్షజగన్నివాస
కామితఫలదా। విమలమగు నీదునామము। అ
మరగదలచెదను నేను అనిశముకృ॥౮౧. దండమ
యావిశ్వంభర।దండమయాపుండరీకదళనేత్రహ
రీ। దండమ యాకరుణానిధి। దండమ యానీకు

నిపుడుదండముకృష్ణా॥ ౯౨. నారాయణలక్ష్మీపతి। నారాయణవాసుదేవనందకుమారా। నారాయణనిను నమ్మితి। నారాయణనన్ను బ్రోవు నగధరకృష్ణా॥ ౯౩. తిరుమణిదురితవిదూరము। తిరుమణిసౌభాగ్యకరముత్రిజగములందున్। తిరుమణిపెట్టినమనుజుడు। పరమపవిత్రుండుభాగ్యవంతుడుకృష్ణా॥ ౯౪. మురవారచక్రాయుధధర। శర్వాణీవినుతనామ జగదభిరామా। నిర్వాణనాథమాధవ। సర్వాత్మకనన్ను గావుసరసుడకృష్ణా॥ ౯౫. శ్రీలక్ష్మీనారాయణ। వాలాయమునిన్ను దలతుబ్రిణుతచరిత్రా। యేలుము ననునీబంటుగ। చాలానినునమ్మినాను సరసుడకృష్ణా॥ ౯౬. శ్రీధరమాధవయచ్యుత। భూధరపురుహూతవినుతపురుషోత్తమనీ। పాదయుగళంబు నెప్పుడు। మోదముతోనమ్మినాడముద్దులకృష్ణా॥ ౯౭. శిరమున రత్నకిరీటము। కరయుగమునశంఖచక్రకఘనభూషణముల్। యురమునవజ్రపుపతకము। సిరినాయకయమరవినుతశ్రీహరికృష్ణా॥ ౯౮. ॥అందెలుపాదములందును। సుందరముగనిచ్చి నాపుసొంపమరంగా। నుందరథమునినన్నుత। సందునివరపుత్రినిన్ను స

మ్మితికృ॥ ౯౯ ॥ కందర్పకోటిసుందర । సుందర ధర
నామ తేజ కోమలదేహా । సుందరవిగ్రహామునిగణ।
వందితమిముదలతుభక్తవత్సలకృ॥ ౧౦౦. అనుదిన
ముకృష్ణశతకము । వినినపఠించిననుముక్తివేడుకగ
లుగున్ । ధనధాన్యముగోగణములు । తనయులు
నభివృద్ధిబొందుతద్దయుకృ॥ ౧౦౧. భారద్వాజస
గోత్రుడ । గౌరవమునగంగమాంబ కరుణాసుతు
డన్ । పేరున్నృసింహాహ్వయుడన్ । శ్రీరమయుత
నన్నుగావుసృష్టినికృష్ణా॥ ౧౦౨॥

కృష్ణశతకము - సంపూర్ణము

# పరిచయపత్రిక.

## పుస్తకవ్యాపారస్థులకు

గోదావరిజిల్లా కాకినాడనగరం పత్రివారివీధి నె 1862ను యింటియందుంచబడిన శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సునందు 8 రకముల తెలుగుటైపులతో అనేకరకముల గ్రంథములు ముద్రించి విక్రయించుచున్నారము. గ్రంథములయందు తప్పులుండవు కాగితములు దళసరివి బైండుమంచిది ధరలుచవుక యిదిగాక వర్తకులకు కొన్నికొన్ని సమయములయందు కేవలము కొన్నిరకములే అమ్మకమునకు జరూరైవుండును ఆప్రకారం యేరకంగ్రంథములు యేఅచ్చుతో యెన్ని దినములకు సప్లయిచేయుమంటే ఆలాగున యివ్వగలము పేపరువగైరా స్టాకు యెప్పుడు ప్రెస్సువారివద్ద నిల్వయుండును.

మంగు వెంకటరంగనాథరావు.

శ్రీవేంకటేశ్వరవిద్యాసాగర ముద్రాక్షరశాల.

